# రాజసందర్శనము

దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ., (ఆనర్సు)
ప్రధానాంధ్రోపన్యాసకుఁడు,
మిసెస్. ఏ. వి. యన్. కళాశాల, విశాఖపట్టణము.

ది స్టాండర్డు ఏజన్సీస్ (మద్రాసు) లిమిటెడ్
వారిచేఁ బ్రకటితము.

సర్వస్వామ్యసంకలితము] [వెల: రు. 1-0-0

ప్రథమ ముద్రణము 1946
ద్వితీయ ముద్రణము 1947
తృతీయ ముద్రణము 1948

# తొలిపలుకు

నేను కొన్నియేండ్లక్రింద శ్రీ తిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతమగు హర్షచరితము నింటరుమీడియటు విద్యార్థులకుఁ బాఠము చెప్పవలసివచ్చెను. అప్పుడందు బాణుఁడు హర్షచక్రవర్తిని దర్శించిన తెఱంగెంతయు నా హృదయము నాకర్షించెను. అప్పటి నుండియు నది వస్తువుగా గ్రహించి యొక చిన్న కావ్యము వ్రాయవలెనని యెంచుచుంటిని. అట్లుచేయుటకు మొన్నకడచిన వేసంగిలోఁ గొంత యవకాశము లభించెను. అది పురస్కరించుకొని యొకపక్షము దినములలో నిది వ్రాసి ముగించితిని. ఏతద్రచనమున బాణుని హర్షచరిత్రమందలి కథను, భావములనుగూడఁ జాలవఱకు గ్రహించితిని. కథావిస్తృతికై కొంతభాగము కల్పించితిని. సహృదయులిందలి గుణములు గ్రహించి దోషములు మన్నింతురు గాక యని ప్రార్థించుచున్నాను.

గ్రంథకర్త.

శ్రీ

## కృతిపతి వంశవర్ణన నక్షత్రమాలిక.

కలఁడు కద కాంతిధిక్కృత కమలహితుఁడు
సకల బృందారకార్చిత చరణయుగుఁడు
నిజతపో నఖదారిత నిఖిలదురిత
హస్తి, కాశ్యపమౌని హార్యక్షవిభుఁడు. 1

ఆతని యన్వయంబున శి
వాంఘ్రి సరోజ సదార్చనాపరుల్
పూతచరిత్రు లార్జవ స
ముజ్జ్వల చిత్తులు దానధర్మ క
ర్మాతతకీర్తి సౌరభ స
మావృత సర్వ దిగంతరుల్ కృపా
న్వీతులు, సాధులెందఱో జ
నించిరి వంశవివృద్ధి హేతులై 2

వారలలోఁ దపోమహిమ
భాసితు, వర్ధిత వంశకీర్తి వి
స్తారుని, శాంకరాగమ క
థాపరిశీలన లగ్నమానసాం
భోరుహు, భోగమాహ్వాదయ
మోహనమూర్తిని బేరరాజు బం
గారయ నామవిశ్రుతు న
ఖండ యశస్కునిఁ బేర్కొనన్వలెన్. 3

వానలు లేక పల్లెలును
బట్టణముల్ కలగుండు చెందఁగా
భూనుతకీర్తి యా ఘనుఁడు
పుణ్యగిరీంద్ర శిరంబుపైఁ దపో
ధ్యాననిరంతర ప్రవణుఁ
డై యచలాత్మతనుండి రాఁ దద
ధ్యానుగతంబులై కురిసె
నంబుధరంబులు కుండపోఁతగన్. 4

ఆమహనీయమూర్తికి గు
ణాలయ జోగమయందుఁ బేరరా
ణ్ణాముఁడు, రామమూర్తి, కరు
ణామయచిత్తుఁడు సుబ్బరావునన్
ధీమహితుల్ కుమారులు జ
నించిరి శీతగిరీంద్రకన్యకా
కాముక పాదపంకజ యు
గప్రకటప్రవణాత్మ బంభరుల్. 5

అందుఁ బేర్రాజు సాల్టుశాఖాధికారి
పదవి వహియించి కీర్తి సంపదగడించె
రామమూర్తియు సబురిజిస్ట్రారుఁ డగుచుఁ
బిదపఁ దహసీలుదారుఁడై పేరుగాంచె. 6

కనియెను రామమూర్తి గుణ
గణ్యుఁడు సారమయన్ పతివ్రతా
గణమణియందుఁ బద్మజు మొ
గంబులో వేదము నాల్గు మూర్తులో

యనఁదగు నల్వు రాత్మజుల
నార్యునిఁ బేరవిభున్, సదాశివున్,
ఘనుఁడగు మల్లికార్జును, వి
కస్వరకీర్తిని రామమూర్తినిన్. 7

అధ్వనిర్మాణ శాఖాంతరోద్యోగియై
గౌరవం బార్జించెఁ బేరరాజు
శశ్వచ్ఛివాంఘ్రి కంజాత లగ్నాత్ముఁడై
ధన్యత్వ మందె సదాశివుండు
ఆంగ్లసారస్వతాధ్యాపకత్వము చెంది
యశమాచికొనె మల్లికార్జునుండు
పాఠశాలావళీపరిదర్శియై మేటి
ప్రఖ్యాతి గడియించె రామమూర్తి
వారిలో నగ్రసంభూతుఁ బేరరాజు
బెండపూడికులాంభోధి విమలరాజుఁ
బేరరాడభిధానుండు పెద్దతండ్రి
జనకు నానతిచేత దత్తునిగఁ గొనియె. 8

సంతత దేవతార్చనల
సజ్జనసేవల సత్పురాణకా
వ్యాంతరవస్తుచింతనల
నాత్మవివేచనలన్ దురాపయో
గాంతిమసిద్ధిసాధనల
నా యనఘాత్ముని తల్లి రత్నమా
కాంత యనంతపుణ్యపు ని
కాయము ప్రోవిడె వంశవృద్ధికై. 9

రత్నమ పుణ్యాకాంతల ప
రంపర రత్నమ యూఁ దదాత్మభూ
రత్నము తల్లిదండ్రుల పు
రాకృత పుణ్యము పంట యాహిత
ప్రత్నకులాఖిలాచరణ
బంధురుఁ డన్వహశంకరార్చనా
యత్న పరాయణాత్ముఁ డల
రారు నుదారుఁడు పేరరాజునున్. 10

శివచరణాంబుజాతయుగ
సేవ నిరంతర సత్పురాణవా
ఙ్నివహమహార్థసంగ్రహణ
నిష్ఠఁ బరోపకృతి ప్రవీణతన్
బవళులు రేలు పుచ్చుచు ఘృ
ణామయుఁ డాతఁడు షష్టివత్సరో
త్సవ మొనసెన్ సమస్తహిత
సంతతి నేత్రమనోహరంబుగన్. 11

పాతివ్రత్యము కొన్నరూపు గుణసం
పజ్జన్మగేహంబు. ధీ
నీతిక్షాంతి దయాలవాలము, భవా
నీపాదపూజోత్సవ
ప్రీతిస్ఫీతమనస్క నన్వయనిధిన్
బెండ్లాడె నాధన్యుఁ డ
జ్ఞాతాత్ముం డల పద్మఁబోలెఁ గనకాం
బాభామినీ రత్నమున్. 12

పంకలు లేని చందనపుఁ
బంతులకున్ నడుమన్ దృతీయదృక్
శంకగొనంగఁ జేయు తిల
కంబు ధరించెడు నాయనన్ దదీ
యాంకధరాస్థితం గనక
మాంబను జూడఁ బురాణదంపతుల్
శంకరపార్వతుల్ భువి ని
సంగినయట్టులు నేత్రపర్వమౌ. 13
విద్వత్సుహృన్మనోఽభీష్ట సిద్ధిక్షేత్ర
మై రహించెడి మేటి పేరరాజు
వినయవిజ్ఞాన సంవిత్పూర్ణమానసుం
డై విరాజిల్లు సన్యాసిరాజు
సకలలౌకికకార్య సంవిధానసమర్థుఁ
డై మించు ఘనకీర్తి రామమూర్తి
విద్యుద్విషయ మహావిజ్ఞానభాసితుం
డై దయివారు ప్రసాదరావు
హితమనఃప్రీతికరుఁడు సర్వేశ్వరుండు
సుగుణవిజ్ఞానములతావు సుబ్బరావు
మఱియు ముప్వురు కూఁతుండ్రు మాన్యచరిత
ధన్యలుద్భవమంది రా దంపతులకు. 14
భూమితలావతీర్ణమయి
పొల్పెసలారు నపూర్వనందనా
రామము వారికుక్షి, యట
రాజిలుఁ గల్పమహీజముల్ జన

స్తోమముపాలి పెన్నిధులు
తుష్టికరమ్ము లనాథపాళికిన్
శ్రీమహితమ్ము తత్తపము
చెందిన సిద్ధికి మాఱురూపముల్. 15

వారలలోనఁ బూర్వజుఁడు,
వంశము పెద్దలొనర్చినట్టి వి
స్తారతపమ్ముపంట, బుధ
సంతతి కల్పమహీరుహమ్ము, వి
ద్యారతుఁ డాశ్రితావన మ
హావ్రత దీక్షితుఁ డొప్పుఁ బేరరా
జోరిమి, దాన, మార్జవము
నొందిన పౌరుషమూర్తియో యనన్. 16

అమలిన భక్తిపూర్ణు లయి
యున్నవచస్సు యథాక్షరమ్ము గా
నమరుచుటందు మారుతికి
నాతని తమ్ముల కీడుజోడులై
సుమధురశీల శాలు లను
జుల్ నిరతంబును గొల్వఁ బేరరా
జమరెడి భూరివైభవమ
హత్త్వము పేర్మి నజాతశత్రుఁడై. 17

వినయము భూరిసంపద, వి
వేకము గర్వములేమి, దీనర
క్షణపరతంత్రబుద్ధి యవి
కత్థనభావము, దానరక్తి దూ

షణమువిరక్తి మోక్షకర
సాధనసక్తి యిహార్థభుక్తియుఙ్
గొనములు పేరరాజుఁ బ్రతి
కూలతఁ బాసి సమాశ్రయించెడిన్. 18
ఊరనుండుటె చాలు దారుణామయపీడి
తునిఁగూడ ధైర్యమ్ముఁగొనఁగఁ జేఁత
యింటికే తెంచుట యిరవుకొన్నా మయం
బడలిసామికి సామి యడఁగిచనుట
చేసేఁతఁగొనుట చొచ్చిన రోగ వికృతికి
గుప్తరీతిగ వీడుకో లొసఁగుట
యగదమిచ్చుట రోగి యఖిల దేహావృత
వ్యాధి నిశ్శేషమై పరుగులిడుట
యని భిషఙ్మణి పేరరాజును గుఱించి
చచ్చిబ్రదికిన యుల్లాఘజనవిసరము
తారకాణలుగా వారి వీరిపేరు
లొప్పఁజెప్పుచు నిచ్చలుఁ జెప్పుకొంద్రు. 19
కవులును బండితాళి రసి
కప్రవరుండని, యర్థిసంతతుల్
దివిషదనోకహంబని, కు
లీనులు యోగ్యుఁడటంచు, బందుగుల్
నవనిధియంచు, మిత్రులు క
లప్రియ భాషియటంచు, రోగవ
న్నివహము సిద్ధహస్తుఁడని
నిత్యముచేరెడిఁ బేరభూపతిన్. 20

అలరాముండు విదేశూరాజుసుతన
ట్లారాజు చాగంటి వం
శలలామంబయి పేరుగన్న శరభే
శప్రాజ్ఞుకూఁతుర్ దయో
జ్జ్వలసన్మంగళవార్ధి, సచ్చరిత, గౌ
రీకాంతనుద్వాహమై
కులదీపమ్ముల సాధులం గొడుకులం
గూఁతుంద్రనుం గాంచెడిన్. 21

శ్రీనివహోవమ్ములు వి
శిష్టతరమ్ములు నైన పున్నెముల్
నేనవి తొంటి పుట్టువున
నిశ్చలబుద్ధి నొనర్చి యుంటినో
భూనుతకీర్తి బెండపుడి
పూజ్య కులార్ణవ పూర్ణిమాసుధా
భానుఁడు పేరరాజు సహ
వాసపు సంపద యావహిల్లఁగన్. 22

ధేనూర్వీగృహ జాతరూపవసనా
దిప్రాజ్యదానంబు లీ
క్షోణిం దొల్లిటినాఁటినుండియును గ
ల్గుల్ వాని నీనేర్చినా
రానందంబునఁ బల్వు రీడ్యచరితుల్
ప్రాణంబు దానంబు లే
నేనాఁడు న్విననాఁతడొక్కనికె య
య్యెం దద్వదాన్యప్రథల్. 23

పన్నిన యామయవ్యథలు
పాపె, నెదెప్పుడు చెప్పుకొన్న నా
విన్నపమాలకించె, విని
వీనుల విందుగ నా కవిత్వముం
మన్ననలిచ్చె, సోదరుని
మాదిరి ప్రేముడిచూఱగొల్పె, నే
నెన్నని చెప్పనాయనెన
యించిన భూరిమహోపకారముల్. 24

అసువుల్ నిల్పిన పుణ్యమూర్తి కిడఁగా
నర్హమ్ములౌ వస్తులే
యన దున్నం దదుపార్జన క్షమత నా
యం దెట్టులుం లేద మా
నసికంబైన కృతజ్ఞతాభరము కొం
తం దీర్చుకోఁ ద్వత్కృపా
ప్రసరార్ద్రింబగు నాదరంబునకుఁ గా
వ్యం బంకితం బిచ్చెదన్. 25

మును శ్రీనాథకవీంద్రచంద్రుఁడు రసాం
భోరాశియౌ కావ్యముం
బ్రణయం బొప్పఁగ బెండపూడి జలధి
ప్రాలేయరుఙ్మూర్తికి
చ్చెను; నేనుం బొనరింతునట్ల యనఘ
శ్రీనాథ మత్కావ్య వ
ర్తనలందుం మహనీయ సత్కృతిపతి
త్వప్రాప్తినే సామ్యముల్. 26

# రాజసందర్శనము

తన పెద్ద నవ్వుఁబోలిన వినిర్మలకీర్తి
కాకరంబని శశాంకార్ధమౌళి
తనయాశ్రితావన తత్పరత్వము గొన్న
పుమ్మూర్తియని రమామోహనుండు
తన జగత్సృష్టికంటెను విశాలమ్మైన
యాత్మకాస్పదమంచు నబ్జభవుఁడు
తమజీవ విద్య నంతముదాఁకఁ జూచిన
పటుబుద్ధి యని దేవవైద్యయుగము
అతులితైశ్వర్యములును ననంతలక్ష్మి
యాయతాయువు వైద్య విద్యాప్రశస్తి
పేర్మి నిడి ప్రోచెదరుగాక బెండపూడి
విమలవంశాబ్ధి ద్విజరాజుఁ బేరరాజు.

స్వస్తి.

శ్రీ

# రాజసందర్శనము

౧

ఉ. శ్రీకరమైన విద్య నవ
రించి, జనస్తవనీయ పండితా
నీక విభూషితమ్ములవ
నీప సభాంతరసీమ లంది, య
స్తోక మతిప్రభావములు
చూపుట యుక్తము గాని కూపమం
డూకము లట్టులి ల్వెడక
నోచ్చుట మెచ్చగునే బుధాళికిన్. 1

గురు శుశ్రూషయ మందరాచలముగా
గూఢార్థరత్నోల్లస
ద్వర విద్యాకలశాబ్ధి ద్రచ్చి, విమలో
దాత్తంబు సంవిత్సుధా
భరముం గొంటిని, దాని సాధుసుమనః
పాళీ సదాస్వాదన
స్థిరసార్థక్యముఁ జేసి, పొందవలదే
శ్రీనిత్య కీర్తిస్తుతుల్. 2

చిన్నతనంపుఁ జాపలము
చే సదసన్మతి లేని కార్యముల్

కొన్ని యొనర్చి యుండుట న
కుంఠితమత్ప్రతిభానవద్య వి
ద్యోన్నతి పాటి చేయక బు
ధోత్తము లెల్లరుఁ బూర్వరీతినే
నన్నుఁ దలంచి మన్నన లొ
నర్పిరెటుల్ తొలఁగింతు నీసడిన్. 3

తనరాజ్యమ్మున సత్కవీశ్వరులు వి
ద్వద్వర్యు లెచ్చోట ను
న్నను, విన్నంతనె ప్రీతిసంభృత మనో
నాళీకుఁడై హర్షవ
ర్ధన భూపాలుఁడు పిల్వఁ బంచు నఁట స
త్కారమ్ములం జేయఁగా
నను రప్పింపఁడు వేరు నాపయిని నిం
దల్ మోపి వంచించిరో. 4

అధిగత సర్వశాస్త్రనిగ
మాంత పురాణకథావివేక స
న్నిధు లయి యుండియు, న్విబుధ
నేతలె కొంద ఱసూయ కెల్లలై
యధిపుల చెంత నన్యవిబు
ధాళిని గూఱిచి లేనిపోని వే
యధమపు గాథలో తెలిపి
రట్టిడి నా దెస నేమి పుట్టెనో. 5

అన్యసచ్ఛీలరాకామృతాంశుప్రభల్
కప్పంగఁ జాలెడి కారు మొయిలు

మర వేఁకురోగా ల్పతర నిదానమ్ముగా
నఖిలాంగముల నేర్చు నామయమ్ము
కలవకుండనె విషో గ్రజ్వాలలను మేను
నవయఁ జేసెడి వింత నల్లత్రాచు
నిర్నిమిత్తముగా నిద్రాశనమ్ముల
నుడిపి యేడ్పించు గ్రముక్కడి పిశాచి
నీచకార్యమ్ములకుఁ జేర్చు రాచబాట
యగుఁగద యసూయ ; తద్వశ గాత్ములగుచు
మామకానంతపాండితీ మహిమ కలఁపఁ
బ్రభునితో నెవ్వ రే నింద పలికినారొ. 6

సరసాత్ముండు, విమృశ్యకారి, కవితా
సారస్యసంవేది, భూ
సురసేవాప్రియుఁ డింగితజ్ఞుఁడు, ధరే
శుండంచు విందున్ గదా
పరకీయోన్నతి సైఁపఁ జాల కథముల్
వాక్రుచ్చు వాక్యమ్ములం
బరిశీలింపక ప్రాకృతుండు వలె వి
శ్వాసమ్ము సంధించునే. 7

పతి యితరోక్తవాక్యములఁ
బ్రత్యయ ముంచి నను న్నిరాదరాం
కితమతిఁ జూచినం బ్రజల
కృత్యము లన్ని తలంచి తేని స
ద్గతి నడపించు కృష్ణవసు
ధాపతి మామక బాల్యమిత్రుఁ డ

మ్మతకరి నీచమానవుల
మాటల దబ్బఱ వెల్లడింపఁడే. 8

భూపతి పిల్వఁబంచుటకు
మున్నె చన న్మన సొప్ప దే మన
స్తాపకరావమానపుఁ బ్ర
సంగము కల్గునొ యంచుఁ గాన పృ
థ్వీపతి మన్మతిప్రతిభ
తీరు నెఱింగి మహాప్రసన్నతా
వ్యాపృతుఁడై ననుం బిలువఁ
బంచెడి దాఁకను వేచియుండెదన్. 9

నరపతులు కూపములవోలె దురవగాహు
లగుట జనులకు వారితో నతిపటుగుణ
కలిత సద్ఘటకప్రాపకతనుగాక
యేల తమ యంత సిద్ధి వహించుఁ బనులు? 10

దారుణారణ్య మధ్యమున వెల్గుచునేరి
నలరింపలేని వెన్నెలవిధాన
జలధిగర్భమున నుజ్జ్వల మౌచు మనుజదు
ర్లభమైన సద్రత్న రాశి వోలెఁ
బర్ణశాఖాదుల బాగుగాఁ బెరిగియు
ఫల మొసంగని పాదపమ్ము భంగి
నాదిశాంతము విశాలాకాశమునఁబర్వి
వర్షింపకుండు నభ్రమ్ము రీతి
నిష్ఫలమ్మగదా ప్రీతి నిర్భరుఁడయి
కవుల విద్వాంసులను జాల గారవించు

సహృదయుండగు శ్రీహర్ష సార్వభౌము
నెడఁద మెప్పించలేని నా యింత చదువు. 11

అని చింతించుచుఁ బ్రీతికూట మను సా
ర్థాఖ్యాగ్రహారంబునన్
దన గేహస్థలి బాణసూరివరుఁ డుం
డ న్విష్ణుఁ డొక్కండు వే
వినతాంగుం డయి వచ్చి కృష్ణధరణీ
భృత్ప్రేషితుం డై మిమున్
గన నేతెంచిన దూత ద్వారమున ను
న్నాఁడం చెఱింగించినన్. 12

వెదుకం బోయినతీవ కాలఁదగిలె
న్వింతయ్యె నేఁడంచు స
మ్మద మేపారఁగ నేగుదెంచి కనియెం
బాణుండు వార్తాహరున్
వదనావేదితదూర భారగమన
ప్రాప్తశ్రముండయ్యు న
భ్యుదయాశంసిదరస్మితు, న్నృపతిలే
ఖోద్యత్కరాంభోజునిన్. 13

మేలిమి బంగరుకాంతుల
మేలం బాడంగఁ దివురు మేని రుచులతో
వేలుపుగిరి యనఁ దగు స
న్మౌళికి బాణునకు దూత నతుఁడై మ్రొక్కెన్. 14

అంతన్దీవనలిచ్చి బాణకవి భ
ద్రా! సర్వలోకప్రజా

శ్రాంతాకారణ బంధుమిత్రు లల కృ
ష్ణక్షోణి భృద్ధర్ష భూ
కాంతుల్ సేమముమైఁ బ్రవర్తిలుదురే
కళ్యాణపుంజంబునై
రంతర్వ్యస్థితిఁ గ్రాలునే పురి నటం
చాసక్తిఁ బ్రశ్నించినన్. 15

నృపుఁడును గృష్ణుఁడు సుఖులై
నిత్యశుభంబును బచ్చతోరణం
బు పరిఢవిల్లెడిం బురిని
బుణ్యచరిత్రుఁడు కృష్ణభూమిపుం
డపరిమితాదరంబు మెయి
నంపెను మీ కొక లేఖ యింద మం
చుపకృతి మూర్తమైన గతి
నుండిన కమ్మయొసంగె దూతయున్. 16

ఆదరమేదురాత్ముఁ డయి
యయ్యది చేత గ్రహించి, కృష్ణభూ
మీదివిజాధినాధున క
మేయ కృపామతి కల్గె మాపయిన్,
మాదురదృష్ట హేతువులు
మాసిన వింక నటంచుఁ బల్కి లే
ఖోదితవార్తలం జదువ
నుత్సుకుఁడై కవి విప్పుచుండఁగన్. 17

ఫలమున కంతరాయములు
పాటిలఁ జేయు వృథాలసత్వమం

చెలయురు పండిత ప్రవరు లెన్నఁడు
దానిని, లేఖలోపలం
గల పరమార్థ మిద్దియ; సు
ఖప్రతిపాదక మహాను శిష్ట మి
ప్పలుకులు వాచికంబుగను
బంపె నృపుండని దూత చెప్పినన్. 18
విని యాత్రముపై నవు నవు
నని దూరాగమనజనిత మహా బడలిక యా
తని మొగమునఁ గని శ్రాణుం
డని పెను విశ్రాంతి పొంద నగునెడ కతనిన్. 19
దినముఖ మాదిగా బయలు
దేఱిన తూరుపు కొండనుండి మిం
చిన రభసంబునన్ గగన
సీమ నిరంతర దీర్ఘ యానముం
బొనరిచి, చాలఁగా బడలి
పోవుట నించుక విశ్రమమ్ము చే
కొన నన సూర్యుఁ డస్తగిరి
కూటమున న్విహరించె నత్తఱిన్. 20
ఖరకరు వేఁడి భానువుల
కర్కశతన్ భరియింపలేక మం
దిరముల యంద యుండి నళి
నీ ప్రియుఁ డస్తమహీధరాగ్రగో
చరుఁ డయి నంతఁ బైకరుగ
సాగె జనాళి దినావసాన బం

ధురమృదుశీతలానిల ము
నోజ్ఞ విహార సముత్సుకాత్ములై. 21
సరయముగా యథావిధిగ
సంధ్య నుపాసనఁ జేసి, కృష్ణభూ
వరుఁడు మహాప్రసాదమునఁ
బంపిన లేఖ పఠించు నాదరం
బురువుగ వేగమైఁ గుడిచి
యుజ్జ్వలదీప సువర్ణ కాంతి కా
కర మయి పొల్చు లోపలి యు
గారముఁ జేరెను బాణుఁ డుత్కుఁడై. 22

౨

శ్రీయుతులకు సత్కవితా
శ్రీయుతులకఖండవైదు షీసహితులకున్
ధీయుక్తి జిత సురోపా
ధ్యాయులకున్ బాణకవివతంసులకు నతుల్. 1
పరదురవాపపాండితిని
పారముగా గడియించి, సత్కవి
త్వరసమహాప్రవాహప్రభ
వమ్మునకున్ గిరిసార్వభౌములై,
స్థిరతరకీర్తి చంద్రికల
దిక్కులకున్నవశోభ కూర్చు చం
దురులగు మీరు పూర్వసుహృ
దున్ స్మరియింతురె కృష్ణభూపతిన్. 2

ప్రతిపక్షవిద్వద్ద్విప శ్రేణులకు హరి
స్వప్నీకృతము మీ వి శాలధిషణ
దశహరిద్వ్యాపిదు ర్వ్యద్గాత్రములకు నూ
త్నాంశుకీకృతము మీ యమలయశము
సహృదయ సంతతి శ్రవణద్వయికి నవ్య
భూషణీకృతము మీ ముద్దుఁగవిత
మూఢమానవ హృదంభోజాతతతి కినో
జ్జ్వలరుచీకృతము మీ వచనసరణి
పండితులు గూడ విస్మయంపడుచుఁ బొగడి
చెప్పుకొనుచుండ నాలకించితిమి, యెడఁద
మోదపూర్ణమ్ముగానింగి ముట్టి మిమ్ముఁ
గాంచ వలె నని చాల వాంఛించితిమిని. 3

మిమ్ముం గాంచి వివేకవారినిధులౌ
మీ వాక్కు లాలించి, మో
దమ్ముం బొందఁగ నేరమే, మయిన నా
త్మం బక్షపాత మ్మమే
య మ్మై వర్తిలు మాకు మీయెడలఁ గ
ల్గారాకరంబందు దూ
ర మ్మందున్న శశాంక మూర్తికి జగా
రాగంబు సాజమ్మగా. 4

పండితులుఁ గవీశ్వరులు
ప్రత్యహముఁ జనుదెంచి హర్షభూ
మండల నేత మెచ్చుకొన
మాన్యమతిప్రతిభా కవిత్వముల్

మెండుగఁ జూపి కానుకల
మేయము లొందుచునుండ మీరు రా
కుండుట చూచి మాహృదయ
ముత్తలపాటు వహించు మిత్రమా. 5
ఆదర మొప్ప నేఁడు కబు
రంపకముందర పో కవజ్ఞయాఁ
గాదె యటందు రేమొ, యది
గాదన, మీయసమాన శేముషీ
వైదుషు లాలకించియు నృ
పాలుఁ డుపేక్ష వహించె దుర్జనుల్
మీదగు బాల్యచాపలము
లేనిది యున్నది పన్ని చెప్పుటన్. 6
సమదృష్టిఁ జగమంత చూచు సుజనుల్
సర్వప్రపంచమ్ము ని
త్యము మిత్రత్వమునే వహించుఁ దమ యం
దం చెంతు రే మాయ చి
త్తములఁ లేని కతానఁ గాని యనిమి
త్రద్వేషులు న్మిత్రవ
ర్గములుఁ గల్గుట నైజ మెంతటి మహా
ర్యశ్రేణికిఁ ధారుణిన్. 7
ఓరువ లేని వాఁ డెవఁడొ
యుజ్జ్వల తావకకీర్తి చంద్రికో
ద్గారమునందుఁ గందు గలు
గఁ దమ యౌవనచాపలంబు నుం

గూటిచి యేదో యేదో పలు
కుచు నృపు ముందరఁ, దోడనే సభా
స్తారు లదట్టిదే యనుచుఁ
దాళము వైతు, రశంకవృత్తినై. 8

జ్ఞానప్రకాశ విరహితు
లైన జనుల చిత్తవృత్తు లక్కట! ప్రవహత్
పానీయము లట్టులు నీ
చానుగములు లోలములును నయి యుండుఁ గదా! 9

కొలువునయందు జేఁ డుచిత
గోష్ఠి యొనర్చుచు వేడ్క నుండ, మీ
యలఘు కవిత్వశక్తి
విషయంబు ప్రసక్తికి వచ్చినంతనే
నలువురు మచ్చరంపు
వచనంబులు పల్కఁగఁ రాజు వింటయే
కలుగును గాని సత్యమె
ఱుఁగం గను నెట్టులు దాల నుంటచే. 10

సమయము చూచి భూపతికిఁ
జన్మ భవచ్చరితంబు చంచల
త్వమునకుఁ గారణం బనుచి
తం బుచితంబు నెఱుంగ నీని బా
ల్యమ యగు, మీరు కాదని య
థార్థము చెప్పితి మాతఁడుగ బహో
క్తములను బాటిసేయని
విధంబుననే కనిపించు నింతకున్. 11

కడచిన దేదియో కడచెఁ
గాలవిలంబన మేల చేయ ని
ప్పుడు సహితమ్ము, చెచ్చెరన
భూపతి దర్శనమాచరింపఁగాఁ
గడఁగుఁడు ; పత్రముల్ ఫలనికా
యము లేని కుజంబుఁ బోలుమా
యొడయనిఁ జూడ రాని తమ
యుజ్జ్వలజీవితరీతి ధీమణీ ! 12

భూరివినోదభోగ పరిపూర్ణులు
రాజులు, వారి కొల్వు స్వే
చ్ఛారతచిత్తవృత్తుల క
సంభవమాట నిజంబ, కాని సా
ధారణ ధారుణీభృదభి
ధానులకున్ మన హర్ష దేవగో
త్రారికిఁ జూడ హస్తిమశ
కాంతర మున్నది సూరిశేఖరా ! 13

శ్రితజనపోషణంబున, వ
శీకృతచిత్తత, ధర్మరక్షణ
వ్రతమున, సత్యవాఙ్నియమ
పాలనమందు, జనానురంజనా
యతమతి, హర్షవర్ధన ధ
రాధిపమౌళి నలాంబరీష భూ
పతులను దొట్టి తొల్లిటి నృ
పాలకపాళిఁ దలంపఁ జేసెడిన్. 14

వెలలవాతని నేత్ర ముల మహాహంకార
కాలకూటవిషాగ్నిఁ గ్రక్కుదృష్ట్లు
వినిపింప వతనినో టను దారుణౌద్ధత్య
భయదరుగ్గద్గద భాషణములు
కనిపింప వతని వర్తనమందు నధికార
గాఢజ్వరోత్థవి కారతతులు
పొడచూప వతని మోమున విస్తృతైశ్వర్య
లాభదర్పోదగ్ర లాంఛనములు
కలుగ వాతని వ్యాపార విలసనమ్ముల
నతుల మదమోహ జనితవి స్మృతుల గతులు
రాజమాత్రుండె హర్షవ ర్ధనబలారి
ప్రజలొనర్చిన పున్నెంబు ఫలముగాక. 15

సూనృత మాడెనా కరుణ
చూఱలొసంగెడి నెట్టివోపికిన్,
మానస మిచ్చి మెచ్చికొనె
నా తినలేని దరిద్రునిన్ మణి
స్నానము లార్చు, వైరి నయి
నన్ మనుచున్ శరణం బటన్న, భూ
జాని గుణంబు లెంత సర
సంబులొ చూతురు గాదె మీరలున్. 16

రత్నబుద్ధి నృపాల రత్నమ్మునకు సుధీ
జనులంద, యుజ్జ్వల న్మణులఁ గాదు ;
ధ్యానంబు నృపతికి దానవంతములు కృ
త్యములంద, కరికరటములఁ గాదు ;

రతిలసత్కవితాభిరతికి ముక్తాస్వచ్ఛ
మగుగుణంబులయంద నగలఁ గాదు ;
ప్రీతి ధర్మావన ప్రీతచేతసునకు
యశమంద, తుచ్ఛదేహమునఁ గాదు ;
భూషణచికీర్ష ధారుణీ భూషణునకు,
సకలదిశలంద, చర్మపుత్త్రికలవంటి
కాంతలం గాదు, తద్గుణకథనమందు
నతిశయోక్తికిఁ దా విసుమంత లేదు. 17

ఉరుమద మత్తచేతను
బరుషత్వము వక్రతమత పడసిన వర్ణో
త్కర ముండ దెచ్చటను మన
నరపాలుని పల్కు సరస నయసూక్తులలోన్. 18

తనవైదుష్యము పెంపు పండితులకున్,
ధాత్రీపతిత్వమ్ము భృ
త్యనికాయమ్మున, కాత్మ మిత్రులకు, దే
హం బుల్లసద్ధర్మసా
ధనకున్, సంపద బీదసాదుల, కమి
త్రశ్రేణి విక్రాంతికిన్,
వినియోగంపడ నేలు నాతఁడు చతు
ర్వారాశరాంతఃక్షితిన్. 19

వినుతరసోజ్జ్వలమ్ము, కవి
బృందమనఃప్రమదావహమ్ము, శో
భనగుణభాసురమ్ము, మధు
వైరిలసత్పదజాత, మర్థసా

ధనము త్వదీయచారుకవి
　　　　తాదివిజాపగ, వన్నె వాసియై
న్లైనసెడి హర్ష రాజపర
　　　　మేశ్వరు నాదల కెక్కుచుండఁగన్. 20

వేయేల నిరతవిద్యా
ద్గేయుఁడు మారాజు పాదకిసలయ మహిత
చ్ఛాయ లభింపఁగ నేర్చునె
వ్యాయతసుకృతాత్ములౌ జనాళికిఁ దక్కన్. 21

క్షితిపతి కొల్వు సేఁత తమ
　　　　కీరితి వెన్నెలకు న్శరత్సమా
గతి యని యెంచి మిత్రునధి
　　　　కప్రణయంబు బహూకరించి స
న్మతి నరుదేరఁగా వలయు
　　　　మానయనంపుఁ జకోరముల్ మహా
ద్భృతిఁ గవిచంద్రమా! ఎదురు
　　　　తెన్నులు చూచెడి మీదు రాకకై. 22

3

అని గతకాలపుం జెలిమి
　　　　యంతయు నక్షరరూప మందఁగా
నొనరిచి కృష్ణభూపతి ప
　　　　రోపకృతివ్రతి పంపినట్టి లే
ఖను గడు తత్పరత్వ మెసఁ
　　　　గం బఠియించి బుధాళిచూలికా

మణి వహించె నుస్మిషిత
మానస మందు నమందమోదమున్. 1

అప్పటికి నడికిరేయాట నొప్పుమీఱెఁ
బ్రీతికూటాగ్రహార మపేతచలన
మాప్తసుఖపారవశ్యము నగుచు యోగి
సత్తముని యాత్మ పగిది ప్రశాంతవృత్తి. 2

అత్తఱి యావనంపు సమ
యంపు సుహృత్తగు కృష్ణభూమిపా
లోత్తము సౌహృదంబు తన
యుల్లమునం గొని యాడుచుఁ విప
శ్చిత్తిలకంబు బాణకవి
సెజ్జపయి న్మొయి చేర్చి భూమిభృ
త్సత్తమదర్శనోచిత వి
ధంబును గూర్చి తలంచె నిట్లుగన్. 3

విముఖతఁ దాల్చి యుండెఁ బృథి
వీపతి యీసున దుష్టులాడువా
క్యముల కతానఁ గృష్ణవసు
ధాధిపుఁ డాప్తనిధాన మాదరం
బమరఁగ రమ్మటంచుఁ గబు
రంపెను బోకకుఁ బోకయుంటకున్
స్తిమితము గాక డోల పగి
దిన్ హృదయమ్ము పరిభ్రమించెడున్. 4

ధరణీపాలుర కొల్వు కష్టతర మ
త్యంతమ్ము గంభీరమై

పరఁగుస్ రాజకులమ్ము మున్నగమన
ప్రత్యాగతుల్ శూన్య మె
వ్వరు మత్పూర్వులు రాజునాశ్రయము సం
పాదింపలే దింక నె
క్కరణిన్ హర్ష మహీపురందరు కటా
క్షశ్రీలు చేకూరునో. 5

నృపతుల తోడ మైత్రి యొన
రింపను, వారి మనఃప్రియంబుకై
కపటపుఁ బ్రేమ యుట్టి పడఁ
గా మెఱమెచ్చులు గుమ్మరింప, వా
రపగత ధర్మమార్గ పరు
లై విహరించిన సైఁప, నాకు ము
న్నపరిచితమ్ము లేకిరియ ధరా
ధిపు నాదృతి చూఱగొందునో. 6

లలితవిద్యార్యాఢి నలరింతు నందునా
యధిపతి సర్వశా స్త్రార్థవిదుఁడు
కవితాప్రసక్తి నా కర్షింతు నందునా
తన్మజాని బహుళరస త్కావ్యకర్త
గాఢమైత్రీశక్తి కరఁగింతు నందునా
భూనాథు మును చూడ నైన లేదు
శ్రీ మించు వారిచేఁ జెప్పింతు నందునా
నృపతివల్లభుల సౌహార్దము సున్న
ప్రవిమలచరిత్రచే వశం పఱుతు నన్న
బాల్యపు టెడాటమున నవ వాదుమిన్న

విత్తమునఁ జేసి రాజు మెప్పింతు నన్న
మాటకును బొందు లేదల మాకు మాకు. 7

భూకాంతు దర్శనమున కి
దే కాల మటంచు వార్సె హితుఁ డీ యదనుం
బోకార్చుకొన్న సిరి రా
మోకా లొడ్డిన ప్రాకారముల్ తలకోవే. 8

భూవరు దర్శనంబునకుఁ
బోవలె నెట్టన యెట్టులైన నా
జీవిత కాననంబు విక
సింపఁగఁ జేయు వసంత మియ్యదే
యావల నా యదృష్టపు న
యం బెటు లుండిన నట్టు లౌను భ
క్తావనబద్ధచిత్తులు పు
రారియుఁ గృష్ణుఁడు నన్నుఁ బ్రోవరే. 9

అని చింతించుచు బాణసత్కవి తదే
కాలోచనావ్యగ్రుఁడై
కనుఁదమ్ముల్ మొగిడించెఁ గాని కునుకొ
క్కండైన రాదాయె నా
మన సేదే శోక గాథ చింతనమున
న్మగ్నమ్ము గా నుండినన్
దిను భోనమ్ము రుచించునే నరులకు
న్నిద్రాసుఖంబబ్బునే. 10

తన్నుం గాంచిన యంత భూపతి హృదం
తర్లగ్న మా భక్తిమై

మన్నింపంగఁ దలంచునో యువమతిం
బాటింపఁగాఁ బూనునో
పున్నెం బెట్లు ఫలించునో యను తలం
పుల్ తక్క నన్యమ్ముత
ద్ధృన్నీరేజము గర్భమందుఁ జొర ద
య్యెం దన్నిశీథంబునన్. 11

నృపతి తన కైత మెచ్చి మన్నించు ననుచు
యౌవనోదంత మెంచి దూఱాడు ననుచు
సారిదిఁ బొంగుచు బిట్టు వందురుచు నతఁడు
కించిదవశేషముగను నేఁగించె రేయి. 12

తోఁచెన్ వేగురుఁజుక్క, యెల్లెడలఁ బ్ర
త్యూషానిలాంకూరముల్
వీఁచెన్, ఋగ్యజుషానువాకములు వ
ల్లింపంగ శిష్యావళుల్
లేచెన్, వామనమూర్తి సన్నుతిల స
ల్లీలోక్తులేచెన్, గవి
ప్రాచీనాథు కనుంగవం బొలిచె ని
ద్రాచిహ్నాలొక్కింతగన్. 13

కనుదోయి మూసినంతనె
జనపాలక దర్శనైక సక్తాంతరుఁడై
తనరు విపశ్చిద్వరునకుఁ
గనుపట్టెన్ దృశ్యమొకఁడు కలలోనిట్టుల్. 14

ప్రవిమలవారి పూర్ణము సు
వర్ణపయోరుహషండ మండితం

బహు రమణీయ మానస సరో
ఽంతర మందొక రాజహంస భ
క్త్యవనత శీర్ష మంచనివ
హంబు తనుం గెడఁగూడి కొల్వఁగా
ధవళ సరోజ పీఠిక ము
దంబున నోలగ ముండె న త్తఱిన్. 15

ఎలప్రాయంపు జగా నిగారములు మై
నింపార, నెమ్మోముపైఁ
గల కాంతుల్విలసన్మతిప్రతిభ వ
క్కాణింప, నందాలతా
వలమై తీవిఁ దలిర్చు మందగతు లొ
ప్పన్ దత్సభాసీమకుం
గలహంసంబొకఁ డేగుదెంచి పతికిం
గైమోడ్చు సంధించినన్. 16

తెలితామర గద్దియపైఁ
గొలువున్న మరాళరాజు, కొలని నలుదెసల్
కలయంగఁ గాంచి వచ్చిన
కలహంసం గూడఁ గనియుఁ గానని భంగిన్. 17

తన పని మగ్నుఁడై కెలని
తట్టున నున్న సితాంగపుంగవుం
గని యట కేగుదెంచిన ఖ
గంబు నవద్యగతప్రవర్తనం
బును గుఱియించి ధిక్కరణ
పూర్వముగా వచియించె నేదొ యా

వనసమయాత్తతన్మలిన
వర్తనమెల్ల నెఱింగియుండుటన్. 18
పరిషన్మధ్యము చొచ్చి మ్రొక్కిన తనున్
స్పష్టమ్ముగాఁ జూచియున్
వరటాకాంతుఁడు పల్కరింపమియు, నిం
దావృత్తి తోఁపంగ దై
ప్పరముల్ నెచ్చెలితోడఁ బల్కుటయు, సం
భావించి యాగంతుకుం
డురులజ్జావనతాస్యుఁడై తిరిగి పో
నూహించె ఖేదంబునన్. 19
అంతలోఁ గొల్వు చాలించె నంచఱేఁడు
సభ్యు లెల్లరు తమ నివాసముల కేగ
నాసనోత్థితు లైరి, హంసాధిపుండు
గద్దె డిగి నూతనాగతు కడకు నరిగి. 20
కవుఁగింటం గదియించి సత్కవివరా!
కార్యాంతరవ్యాపృతిన్
భవదీయాగమనమ్ము నర్హగతి సం
భావింప లేనైతి లో
నవమానమ్ముఁ దలంప కియ్యెడ మదీ
యాస్థానమం దుండి మీ
కవితానూనరసప్రవాహములఁ దో
గం జేయరే మమ్ములన్. 21
అని హంసప్రభుఁ డాడ మానమున న
ర్ధాంగీకృతిం జూపి నూ

తన చక్రాంగము కేలు మోడ్చి నలిక
స్థానంబునన్ దానిఁగ
న్గొని సంసద్గతహంసముల్ పరమసం
తుష్టాంతరంగమ్ములై
యానరించెన్ మణినూపురధ్వనిసఖ
మ్ముల్ మంజులాలాపముల్. 22

సరిగా నయ్యెడఁ దెల్లవాఱుట మహీ
జాతావళీ శాఖికాం
తరనీడస్థవిహంగ సంతతి ప్రబు
ద్ధంబై యొనర్చెన్ మనో
హరమంజుస్వన మిట్లు లో బయట నా
హ్వార స్నినాదమ్ము ని
ద్దుర మేల్కాంచెఁ గవీశ్వరుండు కలయం
దుం గన్న దే యెంచుచున్. 23

సురవిభు దెసఁ బొలిచెను భా
స్కరబింబం బప్పు డంధకార మనెడి ని
ర్జరవైరిఁ దునుమ రాత్రిం
చర శత్రువు విసరి నట్టి చక్రం బనఁగన్. 24

రాతిరి యెల్ల మూసికొని
రవ్యుదయంబయి నంతనే పరి
స్ఫీతదళంబులైన సర
సీస్థిత వారిజముల్ చెలంగె నా
రాతిరి నిద్రచే మొగిడి
రవ్యుదయం బయి నంతనే పరి

స్మితము లైన తెప్పల హసించు
కవీంద్రుని కన్నులట్లుగన్. 25

౪

అంతన్ బాణుఁడు సెజ్జ వీడి వడి క
ల్యంపుం బనుల్ తీర్చి భా
స్వంతున్ నిశ్చలభక్తిఁ గొల్చి కల
దృష్టం బైన వృత్తాంత మ
త్యంతాశ్చర్యద మై ధరాపతిదిదృ
క్షౌత్సుక్య వేగోల్లల
త్స్వాంతుండై తననాఁటి పూనికకు సం
బద్ధంబుగా నుండుటన్. 1

తన యిల్లాలిని జెంతకుం బిలిచి కాం
తా! హర్ష భూపాలద
ర్శనముం జేయఁగ ర మ్మటంచు మన
కృష్ణక్షోణినాథుండు దూ
తను బుచ్చెం గద తత్ప్రియత్నగత చిం
తాలోల చిత్తుండనై
వినుమా! రాత్రి చతుర్థయామున నే
వింతో కలం గాంచితిన్. 2

అని తన కన్న స్వప్న మిను
మంతయు వీడక పూస గ్రుచ్చిన
ట్లనఘుఁడు భార్యకు న్వినిచె
నామెయు ధీనిధి కాన తత్కథా

వినిహితఁ మర్థ మెంచి పృథి
వీపతిదర్శనయత్న మిప్డు శో
భన పరిణామ మయ్యెడి ధ్రు
వంబుగ నంచును బ్రోత్సహించినన్.
కవిచూడామణి తాను వెండియుఁ గలం
గన్నట్టి యా సన్నివే
శవిధం బంతయు లోఁ దలంచుచు మన
శ్చాంచల్యమున్ బాసి కే
శవుపైఁ బర్వతకన్యకాధవునిపై
సంధించి భారమ్ము భూ
ధవ సందర్శనయాన నిశ్చయ హృదం
తర్భాగుఁడై యుండఁగన్.
గమనాయాసముచే నొడ ల్మఱచి సౌ
ఖ్యం బార నాభాస్కరో
ద్గమము న్నిద్దుర చెంది వేగమెయి ప్రా
తఃకృత్యముల్ తీర్చి కృ
ష్ణమహీపాలకు దూత బాణకవి సం
దర్శించె నత్యంత భ
క్త్యమలాత్ముం డయి ఫాలభాగమున హ
స్తాంభోజముల్ మోడ్చుచున్.
అతనిం గాంచి కవీశ్వరుం డుచిత పీ
ఠాసీనుఁ గావించి యా
ప్తతమా! కృష్ణధరాధినాధునకు మా
పై భూరిదాక్షిణ్య సం

భృతచిత్తం బయి యుంటఁ గాదె నినుఁ బం
పించెన్ మదీయార్త పు
ణ్యాతతుల్ పండెను నేఁటి కిప్పుడ ప్రయా
ణం బౌద మంచాదృతిన్. 6

లోని కేగి భూమిజాని దర్శనమున
కరుగుచుంట జాయ కెఱుఁగఁ జెప్పి
తన్ముఖేందుబింబ దర్శిత మ్మగు చిఱు
నగవు వెన్నెలల మనంబు పొంగ. 7

స్నానం బాడి సుధాంశు శుద్ధ పరిధా
నం బిమ్ముగాఁ దాల్చి హ
స్తానం బూని జపాక్షదామమును బ్ర
స్థానోచితం బైన సూ
క్తానీకంబు పఠించి పల్మరు తుషా
రాహార్య రాట్కన్యకా
ప్రాణేశుం గొలిచెన్ బదారు పరిచ
ర్యల్ నిష్ఠఁ గావించుచున్. 8

తొలుదొల్త నాహుతమ్ములు
తిలబీజము లెల్లఁ గాలి ప్రేల్చుచు నుండం
బలుమాఱు నేయి ప్రేల్చుట
నలవోకన్ మండు నగ్ని నాతఁడు గొల్చెన్. 9

ముఱమూరంగ ననుంగుఁ బత్ని గమనం
పు న్మంగళాచారముల్
పదిలింపన్, గురుమిత్రవర్గము లన
ల్పప్రీతిఁ జూడంగ రా

ముదుసళ్ళొ పరిచారకుల్ నుతి శతం
బు ల్వల్క నక్షత్ర దో
హదముం జేసె విపశ్చిదగ్రగుఁడు సి
ద్ధాంతోదిత ప్రక్రియన్. 10
శక్తివంచన లేక సద్విప్రవరులకు
బంగార మొక్కంత పంచిపెట్టి
కడుఁబ్రీతి వత్సమ్ము కాయమ్ము చుంబించు
హోమధేనువు చుట్టు నొదిగి తిరిగి
యవసాంకురంబుల నదిమి గ్రుచ్చిన కొండ
గోగు పూవులు చెవి కొన ధరించి
మృగనాభిమిశ్రిత మ్మగు చందనపుఁ బంక
మురమునందును బాహుయుగళి నలఁది
వయసు పెద్దలు మేలి దీవన లొసంగ
ధర్మగేహిని ఛాత్రసంతతులు గూడి
యానసన్నాహములు శ్రద్ధ నాచరింప
సజ్జితుం డయ్యె సుకవి ప్రస్థానమునకు. 11
కులదైవమ్ముల కంజలించి యనుర
క్తుల్ ధారుణీదేవతల్
ఫలపుష్పాదికహస్తులై యనుసరిం
పన్ బిష్టపంచాంగుళం
బుల శుద్ధంబగు పూర్ణకుంభమును స
మ్మోదంబునం జూచు చిల్
వెడలెన్ బాణవిపశ్చితుండు కుడికా
ల్మెల్లంగ ము న్మోపుచున్. 12

కవి యిలు విడుసమయంబున
నవనత వక్త్రేందుబింబ యాతని యిల్లా
ల్త్రావగముల నవ్వు చూపుల
నివహము పాథేయ మట్లు నెఱి నడరించెన్. 13

సురపతి దిఙ్ముఖంబు పయి
సూర్యుని బింబ మటుల్ లలాటికాం
తరమునయందుఁ గుంకుమక్రొ
త్తం బగు పెత్తిలకంబు గ్రాలఁగా
ధరణి ధరాధినాథ మహి
తం దలఁపించెడి పుణ్యకాంత యొ
క్కరుతుక తోల్తగా నభము
ఖంబయి వచ్చెను బాణసూరికిన్. 14

పరిపూర్ణవారికుంభముఁ దాల్చి యొక చాన
భట్టారకుని యింటి వలని కరిగె
నుతికిన మడుగుదోవతుల మూట ధరించి
రజకుఁ డొక్కఁడు కవిప్రభుని కెరగె
మంజులమ్ముగ వేదమంత్రముల్ చదువుచు
విప్రద్వయము బాణుఁబిలువ వచ్చె
గోమయంబొక కేలఁ గొని యావు వెనువెంట
మెల్లంగఁ జనుదెంచె గొల్ల పడుచు
ప్రక్కగృహమున జరుగు వివాహమునకు
మంగళపు వాద్యము లెసంగె మందశీత
పవనములు వీచెఁ దనుసుఖావహము లగుచు
సూరి గేహము విడి బయల్దేఱు వేళ. 15

ద్వారతలంబులందును గ
వాక్షములందును నిల్చి పాండితీ
సారగురున్, సురూపజిత
శక్రకుమారుఁ గవీంద్రుఁ గాంచు నం
భోరుహపత్ర నేత్రల స
ముజ్జ్వల దృగ్వితతుల్ ఘటించె న
ద్దారి కెలంకులందు నసి
తం బగు కల్వల తోరణంబులన్. 16

గ్రామపర్యంత మం దున్న కాల్వవఱకు
వృద్ధమిత్రాదులందఱు వెంటనంటి
కవి నమస్కృతు లంది వె న్కకును దిరిగి
కదలి వచ్చిరి దూతయు క్కండుదక్క. 17

తనకాంతామణి దారిమధ్య నుపయు
క్తం బౌటకున్ గూర్చి యి
చ్చిన వస్తుప్రతతి న్వహించుచు మహీ
క్షిద్దూత వెన్వెంట రా
మనుజాధీశ్వరదర్శనై కవిషయో
న్మగ్నాంతరంగంబుతోఁ
జనుచుండెన్ గవిసార్వభౌముఁడు మద
స్తంబేరమోద్యద్గతిన్. 18

చను నెడ నేదో విషయం
బును గూర్చి దూత పలుకఁ బోయినఁ గవియున్
వినిపించు కొనక యరుగు
న్మన మన్యాలోచనాని మగ్నం బౌటన్. 19

ఖరకరుతాపమగ్గలము
గాఁ బధిపార్శ్వ తలస్థితోల్లస
త్తరువుల నీడ నిల్చుచు క్షు
ధావ్యథ కల్గిన పట్ల మేదురా
దరమున నింటి యొద్ద వని
తామణి కూర్చిన భక్ష్యముల్ ఫలో
త్కరము భుజించుచుం జనిరి
కవ్యమరేంద్రుఁడు రాజదూతయున్. 20

ఒకసారి నిజయాత్రావ నోదంతముఁ దలంచి
చేతోంతరమ్మున సిగ్గుఁ జెందు
నొకసారిపరుల యూహకుఁ గూడ నందని
తన విద్య నెంచి శ్లాంతిని వహించు
నొకసారి హర్ష దేవోపేక్ష తలపోసి
యెడఁద నుమ్మలికంపుఁ గడలి సేయు
నొకసారి కృష్ణభూమికళత్రు నిర్హేతు
కాదరం బెంచి యానంద మొందు
నొక్కతఱి దూతఁ గాంచి యేమోయి! హర్ష
సార్వభౌముని సౌమ్యతాశయము లెట్టి
వనుచుఁ బ్రశ్నించు సుకవి లోకాగ్రయాయి
యడవి మార్గమ్ము వెంబడి నరుగుచుండి. 21

పడమటికొండ నెత్తముల
పై జలజాప్తుఁడు చేరు వేళ న
య్యడవి మనోజ్ఞ దృశ్యనిచ
యంబుల నారసి పుల్కరించు, నె

క్కుడు మధురమ్ములౌ విహగ
కూజితము ల్విని పారవశ్యముం
బడయుఁ గవీంద్రుఁ డౌ సరస
భావులు రంజిలరే మనోజ్ఞతన్. 22

తపనుం డపరాచలమున
కపసరిలన్ మొగుడు తమ్ము లంకించిన య
ట్లపరాహ్ణకాలజనితా
తపము పొరింబొరిగ నల్పతం గన సాగెన్. 23

ఉరగపుఁ బగ్గపు స్గమి న
నూరుఁడు కేల బిగించి లాగ సు
స్థిరత హరిత్తురంగములు
శీర్షము లెత్తుచు నిల్చె; భాస్కరుం
డరదము నుండి డిగ్గి చర
మావని భృద్విపమస్థలంబులం
దరుగుచుఁ దొట్రుచేఁ బడియె
నవ్వలివంక సముద్రమందునన్. 24

దివిజసరిత్తటమ్ములకు
దృష్టిగతమ్ములయి యుంట దూతయుం
గవియును నాఁటిరాతిరి సు
ఖప్రదశీతల వాయుశోభనం
బవు నొక దావునందు విడి
యంగఁ దలంచిరి దీర్ఘయాన సం
భవవితతశ్రమాలస స
మస్తశరీరులు హీనసత్త్వులై. 25

గీ.

అరుణోద్గతికిన్ మును ని
ద్దుర మేల్కని కవియు రాజదూతయుఁ బ్రాతః
కరణీయము లొనరిచి సుర
సరిదుత్తరణంబు చేసి చని రవ్వలికిన్. 1

అవనీపాలక దర్శనోత్సుకత మా
ర్గాయాసముం బాప నే
త్రవినోదంబు నొసంగు దృశ్యములు సం
దర్శించుచున్, పండిత
స్తవనీయంబులు జైనిసద్గుణము లు
ద్ఘాటించుచున్, రాజధా
న్యవతంసబును జేరి రిర్వురు సము
ద్యద్వేగ యానంబులన్. 2

అలసటతీర నాఁటికొక
యాప్తగృహంబున విశ్రమించి పెం
డలకడ లేచి ప్రాతరుచి
తక్రియలన్నియు నాచరించి ని
శ్చలమగు భక్తి శైలతను
జాహృదయేశ్వరుఁ గొల్చి దూత మే
ఖలకుఁడు వెంట నంటఁ గవి
త్మాపతి దుర్గముచెంతకుం జనెన్. 3

దుర్గద్వారముఁ జొచ్చి యందుఁ గల వ
స్తువ్రాతమున్ హస్తిగో

వర్గంబుం గని విస్మయంపడు కవి
ప్రాలేయ భానున్ వచ
స్సర్గప్రీణితలోకు, దూత గని వా
చామాధురుల్ మీఱఁగా
మారంబందలి యబ్బురంబులు వచిం
పఁగా సాగె నీరీతిగన్. 4

అనిలముచేఁ జలించు తల
లందలి తెల్లని చామరంబు ల
య్యైనరథవాహసంతతి ప
యిం బడఁ దాల్చిన తెక్కజంటలో
యన వెలుఁగొంద హేషల సు
రాశ్వము సైతము పోరు సేయ ర
మ్మను నటు లున్నతేని జవ
నాశ్వములన్ బరికించితే సుధీ. 5

నిరతము కదలించెడి త
త్తురముల పటపటరవంబు తోఁచెడి రాజ్యేం
దిర నాట్యము చేయింపఁగఁ
బరఁగించెడి మద్దెలల శుభస్వనమనఁగన్. 6

క్రోశము లిన్ని యిన్ని త్రుటి
లో నడవంగలవంచుఁ దెల్పఁగా
వ్రాసిన యక్కరాలనఁ బ
రంగెడి గవ్వలమాల లట్టులన్
భాసిల మూర్ధమందు పలు
వన్నెల రోమపు రజ్జువుల్ జటా

పాశము లట్టు లొప్ప నిలు
వంబడు నొంటెలఁ గంటె ధీమణీ! 7

నీలగశాలికిన్ బృథివి,
నింగిని జాతకపక్షి పాళికిన్
జాల మహోత్సవమ్మిడఁగఁ
జాలెడి బృంహితనిస్స్వనమ్ములన్
జీలుచుచుం దిశల్ మదవి
శేషపరీమళముల్ వెలార్చుచున్
నీలనగమ్ములట్లు తవ
ణీల్లు మదద్విరదాళిఁ గాంచితే. 8

అల్లదె వానిమధ్య నల
రారెడు హర్ష మహీంబలద్విష
ద్వల్లభ మా మతంగజము,
దర్పశతాభిధ మాహవంబులం
దెల్లవిభూతులోడి ధర
ణీశులు కాననసీమలందియున్
దల్లడపాటుమానరు గ
దా! తదపార పరాక్రమస్మృతిన్. 9

సతతస్రవద్దాన జలవాహినీ ప్రవా
హములకకాల వర్షాగమమ్ము
సప్తచ్ఛదానిల సౌరభోరుప్రసా
రములకసత్య శ రత్సమయము
నిరతనీహారశీకరసముత్కర వృష్టి
మర్యాదకపర హేమంతఋతువు

దశదిశాకుహర భేదనకల్యగంభీర
గర్జితాళికి వింత కారుమొయిలు
మత్తమధుపావళికిఁ బూన మంటపమ్ము
చక్రివర్తికి బాహ్యాసంస్థమ్మొడంద
దర్పశతమిది దిక్కరీంద్రములసైత
ముల్లమున లెక్కసేయక యుక్కుమీఱు. 10

ఇనరుచినవ్వినట్లు పవ
ళ్లెల్లను బున్నమనాఁటిరేయిగా
నొనరుచునట్లు లంబరమ
హోదధిఁ దెల్లని ఫేనపుంజముల్
నినిచెడు నట్లు లెండ కబ
ళించెడు నట్టులు వేల్పుతేని ల
క్ష్మిని హసియించు నట్లలమి
మీఱెడుఁ గంటె సితాతపత్రముల్. 11

ధరణికిఁ గాశపుష్పనము
దాయసితంబు నకాలసిద్ధమౌ
శరదృతువున్ ఘటించుచు, ది
శావితతిన్ క్షణదృష్టనష్టమౌ
కరణి నొనర్చుచున్, బిసని
కాయగతామలతంతువుల్ నభో
ంతరమునఁ జిమ్ము నట్లలరు
దాలఁ జలత్సిత చామరావళుల్. 12

అవనిపుదర్శనావసర
మబ్బమిఁ గల్గు నవజ్ఞచే శిరం

బవనతముం బొనర్చి మొగ
మచ్ఛ నఖప్రతిబింబితమ్ముగా
నవజిత పూర్వదైన వసు
ధాధిపుఁడెవ్వఁడో లజ్జ మస్తకం
బవయవపాళి దాచుకొను
నట్టులు తోఁచెడి నార్య! చూచితే. 13

ఏమియుఁదోఁపకుండుట మ
హీస్థలి బొట్టనప్రేలిగోరిచేఁ
బ్రాముచు నిట్టటుల్ కదలు
పాదనఖచ్ఛవికైతవంబునన్
జామరసంతతుల్ విసరు
చాయ గనంబడు చొక్కటేఁడు భూ
స్వామి కృపావలోకనశు
భం బగు కాలము వేచియుండెడిన్. 14

తలపూదండలపై పయిం దిరుగు మా
ద్యద్బంభరమ్ముల్ నతుల్
సలుపం గూరు నపత్రపం జనుశిర
స్సందోహముం బోల లో
పలికిం బోవుచు వచ్చు సేవకుల భూ
పశ్రేష్ఠు సందర్శనం
బు లభించుం గద యిప్పుడం చడుగు నా
భూభృత్తతిం జూచితే. 15

పరమతసహనోపేతున్
ధరణీపతినాత్మమతవిధానసంబోధన్

దరియింపఁ జేయు పూనిక
నరుదెంచిన బౌద్ధభిక్షుకావళిఁగంటే. 16

ద్వారతలంబున న్నిలిచి
వచ్చిన వారల నెల్ల దృష్టిసం
చారముచే నదల్చుచు ది
శాకరిహస్తము బోని కేల బం
గారవు దండ మూనిన య
ఖండ మహస్కుఁ డతండు రాజదౌ
వారికులందు నగ్రగుఁడు
వాని యధీనము లెల్ల కార్యముల్. 17

అని వివరించి మేఖలకుఁ
డార్యవరా! క్షణకాలమిందుని
ల్చిననటకేగి భూపవరు
నిం గను కాల మెఱింగి వత్తు నం
చనుమతిఁ బొంది యేగెను, మ
హాకవి సైతము తాను గన్న దృ
శ్యనిచయ మద్భుతావహ మ
హత్త్వము మానసమందు నెంచుచున్. 18

అఖిలభూతపరిక్షయం బగు నటంచు
నణుగణంబుల కత్యయం బమరునంచుఁ
గాలమే చాల దం చేల కనఁడొ ధాత
యీ మహావస్తుతతి సృజియించునపుడు. 19

వెలుపలి వైభవంబుఁగని
విస్మయ మందెడిఁ జిత్త మింతగాఁ
గొలువునయందు నెంత యల
ఘుప్రభుతాభ్యుదయమ్ము కల్గునో
బలరిపు వైభవమ్మయినఁ
బాటికి వచ్చునె యివ్వసుంధరా
తలపతి భూరిభూతి సము
దారత నూఱవ పాలి తోడుతన్. 20

అని తలపోయుచుండ వసు
ధాధిపు దూత పిఱుంద రా మహో
వినయనతాంగుఁడై యుచిత
వేషము మంజులభాష లొప్ప న
య్యనఘునిఁ జేర నేగి ప్రతి
హారకులాగ్రణి కేలుమోడ్చి యి
ట్లనియె సమంచితాదర న
యప్రియభక్తులు సందడింపఁగాన్. 21

కవిచూడామణి! కృష్ణభూవరుఁడు మీ
కై యింతకాలంబు గా
రవమేపారఁగ వేచి కొల్వుకరిగెన్
రాజేంద్రుఁడాస్థానమం
దవనీపాలక సేవితుం డయి వినో
దాలాపముల్ చేయుఁ; రం
డవకాశం బిదె దర్శనంబున కటం
చన్నంత సంతుష్టుఁడై. 22

జని చరితార్థమయ్యె నృప
చంద్రుని మానసమందు మాపయిన్
ఘనతర మానసుగ్రహాము
కల్గె నటంచుఁ గవిప్రకాండుఁ డ
జ్జనపతి కొల్వుకూటము దె
స న్జనియెన్ బ్రతిహారుఁ డల్లన
ల్లన మును పోవు చద్భుతము
లన్ వివరించుచుఁ ద్రోవ చూపఁగన్. 23

౬

ఆదినృపస్థానసీమ శ్రీ హర్ష దేవు
మహిత పాదాబ్జములకు సామంతనృపులు
నతులొనర్చుచు నిజశిరఃస్థితకిరీట
రత్నరుచి నిచ్చుచుండ్రి నీరాజనములు. 1

కరుణకుఁ బెన్నిధానము, వి
కాసము సేవధి, రాచఠీవికిం
దిరమగు నిక్క, విద్యలకు
దీవి, మతిప్రభ కాకరమ్ము, రా
జ్యరమకుఁ బ్రాపు, మంజులవ
చస్సులకు న్నిలయంబు నై సభాం
తరమున హర్షభూపతి సు
ధర్మఁ బురందరుఁ డట్లు శోభిలెన్. 2

శారులుతీర్చి కేలఁ గర
వాలముల ద్ధరియించి సేవకుల్
దూరమునన్ నిలంబడ హి
తుల్ బుధవర్గము రాజలోకమున్
జేరువఁ గూరుచుండి తను
నిర్గత కాంతుల నోలలాడఁగా
భూరమణుండు రాజిలె స
ముజ్జ్వల దున్నత సింహపీఠికన్. 3

విషమనృపాల నీతిపద
వింజరణంబులు తొట్రుపాటుచే
దుసికిలు నేమొ యన్న వెఱ
తోఁ గయిఁ దాల్చి ధర్మదండమున్
దెస లెకిమీఁ ద్రొనర్చు కర
ణీయములన్ బరికింపనో యనన్
లసదవలోకనమ్ముల వె
లార్చుచునుండె నతండు నల్గడన్. 4

కలయంగ మేన నలఁదిన
మలయజపుం బూఁత యతని మైమవ్వపుఁ బె
న్జలరాశి యలలఁ గూడిన
తెలి నురువుల మొత్తమట్లు దీప్తి వహించెన్. 5

చేసిన యాజి వింతలు వ
చించుచు నుండె నతండు తజ్జయ

శ్రీ సవిశేషరాగ వివ
శీకృత పంపిన నర్మగర్భ సం
దేశము నాలకించిన గ
తిన్ బులకించిన రెండు చెక్కులం
భాసిత మందహాసరుచి
మాలికలన్ బ్రసరింపఁజేయుచున్. 6

అరుణాకార పదంబులన్ సుగతర
మ్యం బూరుయుగ్మంబు భా
స్వర వజ్రాయుధ నిష్ఠురంబగు ప్రకో
ష్ఠంబుల్ వృషస్కంధమున్
వరచంద్రాస్యము కృష్ణకేశము మెయిన్
భాసిల్లుటన్ ధారుణీ
వరుఁ డొప్పారె సమస్తదైవతమయ
త్వం బాత్మ సంధిల్లినాన్. 7

కలి నడి నెత్తిపై నిడిన
కైవడి ముత్తెపు మేఖలావళుల్
విలసిలు పాదపీఠమునఁ
బృథ్వీతలం బఖిలంబు కాంతికం
దళిత మొనర్చు వామచర
ణంబును మాత్రము మోపియుంటచే
నలరె నతండు కాళియ ఫ
ణావళిఁ ద్రొక్కెడి కృష్ణుఁడో యనన్. 8

పొత్తు వహించి తేని యుర
మున ముఖమున విడకున్న లచ్చికిన్
బొత్తవుఁ బూవుఁబోఁడి కిర
వుల్ విభజించెడి యానవాలొ, తా
నెత్తెడి భూమిభారము మ
హీంద్రుని మూపుల మోపి నిద్రచే
మత్తిలు శేషుఁడో యనఁగ
మాలిక రంజిలెఁ దద్గళంబునన్. 9

తెల్లని చామరములు గొని
యల్లన వీచెడి లతాంగి యాతని నును చె
క్కిళ్లను బ్రతిబింబితయై
చెల్లె న్వదనస్థ పలుకుఁ జేడియ యనఁగన్. 10

మధురంబు లైన సంభాషణేక్షణములఁ
గానిపించెడి జగా గఱువతనము
సకలసర్వంసహా సామ్రాజ్యలక్ష్మికిఁ
బ్రియనివాసం బైన వెడఁద యురము
ధవళ సరోరుహ ద్వయికిఁదోఁబుట్టువై
చెన్నుమీఱెడి సోగ కన్నుఁదోయి
దిననాథ విపులకాంతి స్ఫూర్తి నవరత్న
భాసుర చ్ఛవిసము జ్జ్వలమకుటము
దిగ్గజకరంబులకు వంక తీర్చు దీర్ఘ
బాహుయుగళము, చంద్రబిం బంబుసారు

నతకరించుమనోహరా స్యమ్మునతని
క్షితిపతిత్వము చెప్పక చెప్పుచుండె. 11

ధనములు స్నేహశూన్యుఁ డని,
తప్పిదముల్ దరిచేర రానివాఁ
డనుచు, నగమ్ము డంచుఁ గలి,
యాత్మభవుండు జితేంద్రియత్వశో
భనుఁ డనుచు, న్ద్విషత్తతు ల
పారసహోయుఁ డటంచు, నెచ్చెలుల్
చనవరి యంచు నాతని దె
సన్ వహియింత్రు భయానురాగముల్. 12

ప్రతిహారుండును దూత ముందు నడవన్
బాణుండు మార్గస్థి తా
ద్భుతముల్ చూచుచుఁ గొల్వు చొచ్చి కనియెన్
భూభృత్సుధీమిత్ర సం
తతిమధ్య న్ద్విజపాళిమధ్య రజనీ
నాథుండు వోలెన్ సమం
చితకాంత్యున్నతి వెల్గు హర్షధరణీ
క్షితిన్మౌళి మాణిక్యమున్. 13

కని నిగృహీతుని పోలిక
ననుగ్రహం బందఁ గోరు నాతని వలె నా
ననము పులకింప నశ్రుల్
కనుఁగవ నిండంగ నిట్లు గాఁ దలపోసెన్. 14

క్షితి రాజన్వతి యయ్యె వేని కతనన్
శ్రీదేవి కెవ్వాఁడు సం
తతవాసం బగు, సూరిసంతతికి బృం
దారావనీజం బెవం
డతికాలోద్భుత సద్గుణంబుల కెవం
డాధార మార్తావన
వ్రత దీక్షాపరుఁ డెవ్వఁ డా ఘనుఁడు హా
ర్ష క్షోణిపుం డీతఁడా ? 15

హరి వోలె నీభూమి వరుఁడు బాల్యమునందు
వృషవిరోధమ్ము నా ర్జింపలేదు
ఇందుశేఖరుని య ట్లీ మహీపాల శే
ఖరుఁడు దక్షత్రాస కరుఁడు కాఁడు
పాకశాసనుని కై వడి నీ నృపాలుండు
గోత్రవర్గవినాశకుండు గాఁడు
ఇందుసంపద వోలె నీమహారాజు భా
గ్య మ్మెప్డు దోషోపహతము కాదు
యక్షనాథుని సన్నిధు లట్టు లితని
సన్నిధులు వ్యర్థములు కావు, శమను భంగిఁ
గాఁ డితఁడు దండధారి, యీ ఘనుని రాజ్య
మహాహా ! యలరారుచుండు నత్యమర మగుచు. 16

రమణీయాకృతి యైన, గమ్యుఁ డయినన్
రాజేంద్రుఁ డేరంగఁ జి

త్తము విస్తారభయాకులం బయి కలం
తం జెందెడిన్ భూపస
త్తముఁ డీతండ క్షణక్షణమ్ము నయన
ద్వంద్వంబునన్ వార్ధిధా
నము చందంబునఁ గానిపించెడి వినూ
త్నం బైన రూపంబునన్. 17

అనుచు మనమున వర్ణించుకొనుచు రాజ
సేవకానీతపథమునఁ జెంత కరిగి
వినయమును భక్తి తగ నుపవీతి యగుచుఁ
జెవుల విందుగ జేసి నాశీర్వదించె. 18

అత్తఱి రాజసౌధమున
కవ్వల నుండిన హస్తిపాలుఁ డు
న్మత్తకరీంద్రముఁ గుఱిచి
మంజులభంగిఁ గజేంద్ర! మాని నీ
చిత్తమునందుఁ జాపలము
శీర్షము వంపు వినీతివై సదా
యుత్తము సుమ్ము సింహానఖ
రాభము సిళ్లని మండలించినన్. 19

అది విని సార్వభౌముఁడు ని
జాగ్రతలస్థితుఁ బండితుం బదిం
బది పరికించి ద్వారపరి
పాలకుతో ననె నీతఁడా జగ

ద్విదితయశుండు బాణుఁ డని
పృథ్వీధరాంతర కందరాముఖా
భ్యుదితమృగేంద్ర గర్జిత స
ముజ్జ్వలకంఠరవంబు మీఱఁగన్. 20

అంతట ద్వారపాలుఁడు ధ
రాధిప! చిత్త మితండ బాణుఁడ
న్నంతనె చక్రవర్తి మొగ
మవ్వలి వంకకుఁ ద్రిప్పి రక్తనే
త్రాంతము లల్క తెల్పఁగ ని
జాంతనిషణ్ణుఁడు మాళ్వరాజుతో
నింత మహాభుజంగుఁ డితఁ
డే సుమి యంచు వచించె మెల్లఁగా. 21

మాలవరాజు ఱేఁ డనిన
మాటల యర్థ మెఱుంగఁ డాయె, భూ
పాలకు లన్యు లెవ్వరును
వా తెఱ విప్పర, బాణుఁడంత ల
జ్జాలసచిత్తుఁ డానతము
ఖాబ్జుఁడునై క్షణ కాలముండి కాం
తాళము మీఱ నిట్లు జన
నాథునితోఁ బలికెన్ వినీతిమై. 22

కలరూ పెఱుఁగక దేవర
ఖలమతు లెవ్వారొ యనిన కపటోక్తుల వీ

నులఁ జొన్ని యీ తెలుంగునఁ
బలువురిలోఁ నన్నుఁ గూర్చి పలుకుట మేలే. 23

జగము యథేష్టవర్తనము,
సత్య మసత్య మటం చెఱుంగకుం
డఁగ వచియించు నేది యయి
నన్, జనవాక్కులు చిత్రచిత్రముల్
తగిన పరీక్ష చేసి యన్న
తంబొ యథార్థమొ త్రచ్చి చూడ కో
సుగుణనిధాన ! విన్న వచ
నుల్ విననట్లులె విశ్వసింతురే. 24

బ్రాహ్మణుండను సోమ పాయివాత్స్యాయన
వంశంబునం దుద్భ వంబుఁ గంటి
నాగమోక్త విధాన మలరంగ నుపనయ
నాది సంస్కారమ్ము లన్ని గొంటి
వేదవేదాంగముల్ వివిధశాస్త్రమ్ములు
సర్వతోముఖముగాఁ జదివియుంటి
ననుకూల భార్యఁజే కొని గృహస్థుండనై
యతిథి పూజానంద మందుచుంటి
ప్రత్యహము భక్తితత్పర త్వంబెసంగ
శ్రితజనావను శివునిఁ బూజించుచుంటి
నిట్టి ననుఁ గొల్వునందు శిష్టేతరుఁ డని
పేరుకొనఁ బాడి యౌనె పృథ్వీమహేంద్ర ! 25

"కామే భుజంగతా" పర
భూమీశ్వర ప్రాణవాయు భుజగాధిప! నిం
దామయములు నీవాక్కులు
నామదినొనరించు వేదనావికలముగన్. 26

పరమున నిచ్చటం జెడుగు
పాటిల నీయని చాపలంపు టా
చరణము లేవో బాల్యము వ
శంబునఁ జేసితి నేమొ, వానికై
కర మనుతాప మందు చధి
కంబుగ సిగ్గిలుచుంటి ధారుణీ
వర! చపలత్వ మెవ్వరికి
బాల్యనిసర్గము కాకయుండెడిన్. 27

అనుపమశాంతి శాక్యముని
వై, మను వట్టులు వర్ణధర్మముల్
పెనుచుచు, దక్షిణేశ్వరు వ
లె న్సమవర్తిత దండధారివై,
దినకర తేజ మొప్ప, భువి
దేవర పాలన చేయుచుండ దు
ర్వినయము మాట యెత్తఁడొన
రింపఁగ నెవ్వఁడు సాహసించెడిన్. 28

జక్కవలాత్మ సిగ్గిలక
చానలఁ గూడవు, వానరావళుల్
తక్క భయంబు నైజచప
లత్వము చూపవు, స్వేచ్ఛనానవే

లెక్కయు లేక తేనియ ల
ళిప్రకరంబులు నీ భయానఁ, ది
ర్వ్యక్కలె యిట్టులుండ మను
జావళిఁ గూఱిచి చెప్ప నేటికిన్. 29

వేయి వచింపనేల పృథ్
వీ వర ! నాదగు భాగ్య మిట్లన
త్ప్రియత చెందె మీకును బ
దంపడి సత్యము గోచరించుఁ, బ్ర
జ్ఞాయుతు లౌ మహాత్ముల మ
నంబు లొకప్పుడు తప్పు దారులన్
బోయెడి చిత్తవృత్తివిధ
ముల్ మరలింపఁగఁ జాలెడింగదా. 30

అని వచియించి బాణకవి
యుక్తి నిలంబడెఁ జక్రవర్తియున్
వినితిమి మేము నీదగు ప్ర
వృత్తిని గూఱిచి యావిధంబుగా
ననియెను గాని వేఱు పలు
కాడుట యాసన మిచ్చు టాదిగా
నొనరుపఁ డాయె నాతనికి
నొక్కటి యైన సమర్హసత్క్రియన్. 31

పరివారంబు తొలంగఁ బుచ్చి ధరణీ
పాలాళి వీడ్కొల్పి ద
గ్గఱనే నిల్చిన కృష్ణభూపతి కిదో
కర్ణంబునం జెప్పి, భూ

వరుఁ డా సత్కవి వంక స్నేహరస గ
ర్భంబుల్ కటాక్షావళుల్
పరఁగం జేయుచుఁ గొల్వు వీడి చనె దృ
ప్యత్కుంజరంబోయనన్. 32

౭

నరపతి కొల్వువీడిన క్ష
ణంబుననే కవివర్యుఁడు౯ సభాం
తరగమితావమానము మ
నం బగలింపఁగ మాటిమాటికి౯
గురు పరితాపభారమున
కు న్గుఱియై తనమిత్రవర్యు మం
దిరమున కేగె నైజ దుర
దృష్ట విశేష మిటుల్ తలంచుచున్ 1

అతుల పాండిత్య గరిమ కా హ్లాద మంది
యుచితసత్కృతు లొనరింప కున్న ఱేఁడు
ప్రియవచస్సుల నే నాదరింప లేదు
నాయభాగ్యము నేమి వర్ణన మొనర్తు. 2

మలినమనస్కు లౌచుఁ బలు
మాఱులు నాదగు బాల్యకాలచా
పలమునుగూర్చి దుర్జనులు
పల్కిన మాటల, నట్టిహానికిన్

ఫలితము లైన లోకులప
వాదములన్ విని నాపయి న్నృపుం
డలిగె ననుగ్రహ మ్ముదవు
నా? యిఁక దర్శన మాచరించినన్. 3

హృది విపరీతభావము వ
హించుట నాపయి తేఁ డనుగ్రహా
భ్యుదయము చూపకున్నఁ గొలు
వు న్విడునప్పుడు స్నిగ్ధమూర్తియై
పొదిగొలిపెన్ బ్రసాదపరి
పూర్ణవిలోకన మాలికల్ పదిం
బది నడె చీఁకటి న్దివియ
భంగి నొకించుక యాశ గొల్పెడిన్. 4

కలలో నూతనహంసముం దొలుత ధి
క్కారించినన్ బిమ్మటన్
గలహంసప్రభుఁ డాదరించి నటులే
కాలక్రమానన్ మదు
జ్జ్వలశ్రీసంపద సత్ప్రవర్తనము రా
జశ్రేష్ఠుఁ డాలించి నన్
బిలిపింపంగఁ దలంచునేమొ యని యా
వేదించు లోనెద్దియో. 5

గుణవంతుండగు రాజచంద్రుఁ డనుర
క్తుం డౌటకు న్మాటు దు
ర్వినయంబుం దలపోసి నా దెస క్రుధా
వేశంబు గైకొంట మ

జ్ఞనదౌర్భాగ్యము కాదె! యాతఁడీక యా
థార్థ్యంబు గుర్తించి నా
యనఘత్వంబును మెచ్చి కొల్వునకు నా
హ్వానింప వర్తించెదన్ 6

కాల మేగు కొలంది భూపాలవరున
కమల మద్వర్తనము తెలియంగ వచ్చుఁ
గాని నిజదోషజనితావమానభరిత
మైన నాజన్మ మఖిల నింద్యమ్ము కాదె! 7

అని చింతించుచుఁ బండితోత్తముఁడు మి
త్రాగారముం జేర వ
చ్చిన యా కాలము నందె కృష్ణధరణీ
క్షిద్వార్యుఁడున్ దూత తోఁ
జనుదే నయ్యెడ కేగుదెంచి వినయాం
చన్మౌళియై, భక్తి, సం
దనముం జేసి కవిప్రకాండునకు వి
జ్ఞాపించె నీ రీతిగన్. 8

అనుఁగు నెచ్చెలి! కవిసమాజాగ్రగణ్య!
నేను వ్రాసిన లేఖ మన్నించినార
రరుగుదెంచితి రిటకు నెయ్యంబు మెఱయ
నస్మదక్షిద్వయము చరితార్థమయ్యె. 9

కొలువున సార్వభౌముఁ డను
కూలవచస్సులు పల్కి సత్కృతుల్

సలుపఁ డటంచు వేఁడుగఁ ద
లంపటుఁడాత్మ, భవన్మతిప్రభా
విలసిత వర్తనమ్ములను
వీనుల విందుగ నాలకించి భూ
తలపతి మీఁదెసన్ దన కృ
తంబునకుం బరితాప మొందెడిన్. 10

నరపతిఁ గూర్చి యోలగము
నం దమ పల్కిన యర్థవద్వచః
శరములు తన్మన స్థలము
సంస్కృతముం బొనరించి సత్కృపాం
కురములు పాదుకొల్పెఁ గవి
కుంజర! యారసి యుంటి రేక దా
యరిగెడు వేళ మీవలన
నాతఁ డడర్చిన నెయ్యపుం దృశల్. 11

పాలసు లెవ్వరో కలుష
భావముచేఁ బురికొల్ప జేఁడు తా
త్కాలికమైన కోపము క
తంబున మిమ్ము నిరాకరించుటం
జాల విషణ్ణుఁడై నుడువఁ
జాలని భక్తిమెయిన్ బహుక్షమా
శాలిత మీరు దర్శన మొ
సంగఁగఁ గోరెడి మన్ముఖంబునన్. 12

బలవత్తరమగు కారణ
ములవడినం గాని కలఁగ రాత్మ వివేకుల్

కలఁగిన వెనువెంటనె ని
ర్గళిత వికృతులగుచుఁ బ్రకృతిఁ గాంచెదరు గదా. 13

జనపతి యోలగమ్మున వి
శాంపతులున్ బరిచారకుల్ సుధీ
జనములు నాలకింపఁ బరు
షంబులు పల్కె నటంచు నాగ్రహం
బెనయక తత్ప్రసన్నత, య
హీనవివేకము, నీవి పెంపు, మ
త్ప్రణయము నెంచి రేపకడ
రానలెఁ గొల్వునకు న్సుధీమణీ! 14

అనుచు విన్నవించి యనఘుఁడౌ కవిచంద్రు
నాననంబునందు నాదరంపు
గుఱుతు లరసి కృష్ణ నరపాలుఁ డాత్మగే
హమున కరిగె నతని యనుమతి గొని. 15

కొలువున కేగుదెంచి తన
కుం గయి మోడ్చిన నాత్మహంసముం
దొలుఁదొలుత న్నిరాదృతిఁ గ
నుంగొని యవ్వల భూరిసౌహృదా
కలిత మనస్కుఁడై పరమ
గౌరవ భాజనుఁగా నొనర్చు హం
సల యెకిమీని చేష్ట కవి
మానస వీధి స్ఫురించె నయ్యెడన్. 16

తనమహాపాండిత్య వనరాశిలో నృపుం
డానందమున నోల లాడినట్లు
తనమనోహర కవిత్వవసంతవనములో
తేఁ డుత్సుకత విహరించినట్లు
తనమంజులప్రియ ఫణితిమాధ్వీరసం
బవనీశ్వరుం డగ్ధి నాని నట్లు
తన గాఢమైత్రీ సుధాలేపనంబుచే
నౌడయుండు మైమఱ పొందినట్లు

విస్మితుండైనటులు, రస వివశచిత్తుఁ
డైనటులు, ప్రీతి నిర్భరుఁ డైనయట్లు
గౌరవించిన యట్టులా కవివతంసుఁ
డా రజని నిద్ర స్వప్నమ్ము నందుఁగాంచె. 17

తొలిమల నెత్తముపైఁ ద
మ్ముల చెలి యలరారె తేఁడు పుత్తెంచినయే
న్గుల తేనిపైని కవి రా
జలరె న్మఱునాఁడు ప్రాత రారంభమునన్. 18

మంగళ వాద్యానాదము ల
మందముగాఁ జెలఁగం గవీంద్రు ను
త్తుంగగజంబుపై మహాము
తోఁ బుర మేగఁగఁ జేసి భక్తి న
మ్రాంగులు పౌరజానపదు
లారతు లెత్తఁగ మంత్రి భూమి భృ

త్పుంగవు లోలగంబునకుఁ
దోకొని వచ్చిరి వైభవంబునన్. 19

నరపతులు పండితులు వెంట నరుగుదేరఁ
బ్రభువు కవిపతి కెదురేగి భక్తి నెఱఁగి
యిభముపై నుండి కేలూత యిచ్చి దింపి
యతని సింహాసనముచెంత కానయించె. 20

కొలువుననున్న పండితుల
గుండెలు తల్లడమందఁ, గృష్ణభూ
తలపతి మోముఁదామర ని
తాంతవికాసము చెంద, సభ్యుల
గ్గలిక వహింప, సత్కవి శి
ఖామణి సింగపుఁ బీఠి చెంత రం
జిలు సరిగద్దెపై నధివ
సించె నృపాలుని వేఁడికోలునన్. 21

ఉన్నత వేదికాంతర మ
హోన్నత పీఠతలంబునందుఁ గూ
ర్చున్న కవీంద్ర ధారుణి వ
రుల్ విలసిల్లిరి కాంతిసంపద
భ్యున్నతిఁ జేసి యింద్రహరి
దుర్విధరాగ్రమునందు నొక్కటం
గ్రొన్నటి పేర్మితోఁ బొడిచి
కొల్కొను చంద్ర దినేంద్రులో యనన్. 22

ఆదినమే మొదల్ కవియు
　　హర్షమహీరమణుండు నేకతా
పాదిత చిత్తులై విహిత
　　భావవిశేషముతోడ వర్తిలన్
భూదివిజాధినాయకుఁడు
　　పోరుల, వేఁటల, నోలగంబునన్
గాదిలి పండితుండు చెలి
　　గాఁ గనిపింపఁడె నాఁటినుండియున్. 23

అధికసఖ్యంబు కతన నన్యోన్య మెపుడు
తలఁచుచుంట భ్రమరకీట ధర్మ మొప్ప
సార్వభౌముఁడు సత్కవిచంద్రుఁడయ్యె
బాణకవి చంద్రుఁడును సార్వభౌముఁడయ్యె. 24

గౌరీ కాంతాప్రియుఁ డి
స్తారోదార్యాబ్ధి ననుజ తనుజ సుహృ
ద్వారయుతుఁ జేర రాజును
గౌరీకాంతుండు ప్రోచుఁ గావుత మెపుడున్. 25

స్వస్తి.

PRINTED AT THE LIBERTY PRESS, MADRAS.